

# తారకాలింగద్విశతిస్తోత్రము.



ఇది

చేగంటి సుబ్రహ్మణ్య శాస్త్రులవారిచే

రచియింపఁబడి

తె॥లు

శ్రీసౌదామినీముద్రాక్షరశాలలో

మొదటికూర్పు

1000 ప్రతులు.

డి. వి. రమణారావుగారిచే

ముద్రింపఁబడి

గ్రంథకర్తగారిచే ప్రకటింపఁబడియె.

 1910 [వెల రు 0-2-0

అనుపద్యముంబట్టి చూడఁగాఁ జిరకాలమునుండి గజకచ్ఛపములపోరు నుంబోలి వచ్చుచున్న రేఫశకటరేఫవిభేదవిషయమున నీకవి యుదాసీనుఁడై యున్నట్లు తోఁచుచున్నది.

40. క. ఎండెండఱు * * * * నా
యందిచ్చుపూజ* * * *

66. క. వందిహాయము * * * * వతు
లండీయ * * * * *

అనుపద్యములయందు క్ష్వాక్షకేకారసంజ్ఞయు,

137. క. నాదఁనిడాలింగిశలను * * * * * * కై
లూదుక* * * * * * * * * *

అనుచోటఁ గోనికి కాదేశమును,

117. క. ప్రణవాంచిత * * * * * * * *
మణిఖచిత * * * * * * * * *
ఘనమతి * * * * * * * * *
ఘన! రాగిదె * * * * * * * *

అనుచో స, ణలకుఁ బ్రాసమును గల్పించుచున్నవి. ఇట్టివి పెనాశాలభ్యమునకై నిరాఘాటముగఁ బ్రయోగించినవేగాని, సామర్థ్యలోపము వలనఁ గాని, ప్రమాదమువలనఁ గాని ప్రయోగించినవి కావని తలంచెదము. ప్రాపంచికానుభవమును, పాండిత్యమును పరిపూర్ణముగాఁ గలయిమ్మహాకవి యింకను వివిధవిషయములఁ గూర్చి సద్గ్రంథముల రచియించి లోకోపకారముం జేయ నోపుఁగాక! పరమేశ్వరుం డీవిద్వత్కవికిఁ జిరాయురారోగ్యము లొసంగుఁగాక!

ఇట్లు

తణుకు.
6-6-1910.

సుకవివిధేయులు,
వేంకటపార్వతీశ్వరకవులు.

శ్రీ మత్తారకాలింగశివమూర్తయే నమః

# తారకాలింగప్రస్తావము

---

శ్లో. ఆకాశే తారకాలింగం పాతాళే హాటకేశ్వరం
మర్త్యలోకే మహాకాళం దృష్ట్వా కామితమాప్నుయాత్.

అయ్యలారా! యాకాశమునం జెందు తారకాలింగము శివావతారములలో నొకటి. తొల్లి విరించి సరస్వతిం సృజించి యామెను వలపునం గలియంగోరినన్నను నంతనా భారతీదేవి తన్ను సృజించిన యాతాత యొడల భర్తృభావంబు సేయనొల్లక తనపై మరులునం ద్వరపడు నవ్విరించనుని జూచి పోదలంచి హరిణరూపంబున నంబరంబునం బారుచుండ దన్నిరీక్షించి తానును మృగరూపియై పోనీకవచ్చు నా ధాతకు నేతెల్లి యున్నారవస్థని పరమేశ్వరుం గూర్చి పరిదేవనం బొనర్చిన స్మరహరుండు దరిమొనరిగి శరశరాసనంబులు గొని యటవేగందోచి వేటకాడై తనంబు దోప మృగరూపుండైన యప్పరమేష్ఠి శిరంబు నిజశరాగ్రనంబుం ద్రెంచెననియు, నాంటనుండి నేంటివఱకు నయ్యార్ద్ర కతునాకృతి నప్పరమేష్ఠి ధనువహ యుడుపథంబున మసలుచుండెననియును, బుష్పదంతుండను గంధర్వవరుండు శివమహిమ్నస్తోత్రంబునందు (ప్రజానాథం నాథ) యను శ్లోకంబునం జెప్పియున్నవాఁడు.

కొన్ని చరనక్షత్రములమండలమై లింగాకారముగాఁ గన్పట్టునీపావనమూర్తికి మృగశిరమను నక్షత్రములు మూడు శిరస్సు. దానిక్రిందిగువనున్న యార్ద్రానక్షత్రమును నంతటి వేఱొక చరనక్షత్రమును నా దేవునికి భుజద్వయము. ఆక్రింద గొల్లకావడి యను నైదు చుక్కలాస్వామికి మధ్యము. మఱికొన్ని చిన్న చుక్కలచే రాక్రిందఁ గానవచ్చును. దానిక్రింది

వాఁడేను వరున్న యామెలయొక్క ముందరి గొలుసులనుండి యిద్దఱు దివ్యస్త్రీపురుషులు దిగుచు నాకన్నులకుం గన్పట్టినంత నానోట «కంఠసిరి మెచ్చిరు వారిమెచ్చిరు" అనికందపద్యపాదము వెడలుటయును వారిరువురు లోకపూజ్యులైన లక్ష్మీనారాయణదంపతు లనిస్ఫురించినంత నేనుదిగ్గన లేచి ప్రణమిల్లి వారిరువురం బంచరత్నములచేః బ్రస్తుతించి పిదప నాపద్యమును బూరించుకొంటిని.

తారకాలింగము తరువాత శ్రావణ మాసము మొదలు చైత్రాంతము వఱకును మూస్పనుండి పదునట నుక్కన కుత్తరాగ్రముగాఁ జరించుచుండును.

చదువరులారా! నారచించినపద్యములు చినచిన్నకందములు గదా! వానిలోఁ 'తారకాలింగశిఖా' యను మకుటముచేఁ బ్రతిపద్యమును ముగించుచ యుంటిని. ఇందును ప్రకార యతి ప్రతిబంధమ్ముకొంటి కలదు. మిగిలిన స్థలములలో నాభావ మంతయు మీకు సులువుగా వెల్లడింపఁ జాలి యుంటినో లేనో కదా? లేకున్న నాభావంబు తెలుసుకొనుటకు మీకేమి శ్రమము కలిగింతునో యని నాస్వాంతంబునఁ గొంత చింత పొడముచున్నది. గాని నాకిందులకుఁ బనియేమి! ముమ్ము నాధన్యతకార్యావసునియుం దుంచినభార మిప్పపార్శ్వవరుల యందుఁబెట్టి యథాపూర్వంబుగ ధీరుండనయ్యెద—సుధీజనులారా! మీకొలైన శ్రమ యీయవలసి నేనున్న—ఈగ్రంథమునం బరమేశ్వరున కేనొనర్చిన విందునందలి పదార్థములు హితశుచి రుచ్యంబులు కాకున్నం బరమేశ్వరప్రీతికిం గాకుండు. లోకులును హర్షింపరుగదా!

ఇందు వీరాది సహాయంబుచే జూపిన ముందుకూర్పున సవరించుకొనియెద. తారకాలింగ మహాత్మ్యంబులు నాయనుభవ సిద్ధంబులు చాలగలవు. అవియును; మహారహస్యంబును, బుధజన శ్లాఘాపాత్రంబును నైన లింగస్వరూపనిరూపణంబునుం గూడ రెండవ కూర్పునందే ప్రకటింపం దలంచి గ్రంథవిస్తరభయంబున నిట విరమించితి.

శ్లో. (సత్యపూతాంవదేద్వాచ) మ్మను విధివచనాను సారముగ నే దెలిపెద. ఈమానసికపూజావిధాన శివస్తోత్రము నామూలాగ్రముగ భక్తితో బఠించిన నాఁ డేదియో దైవమహాత్మ్యము గనుచువచ్చితి.

ఇట్లు విధేయుఁడు,
చేగంటి సుబ్రహ్మణ్యశాస్త్రి,
తెఃబకు కృష్ణాజిల్లా.

# శ్రీతారకాలింగద్విశతిస్తోత్రము శ్రీ



క. శ్రీమహిళాలంకృతనిజ
ధామున్ భక్తాభయప్ర * దానవదాన్యున్
మామకహితసిద్ధికినై
సామజముఖు నాదిపూజ్యు * శాంకరిఁ గొలుతున్.

క. వాణిన్ వీణాపుస్తక
పాణిన్ బరమేష్ఠిరాణిఁ * బ్రాణిహృదంత
ర్వాణిం బదవినమితగీ
ర్వాణిం బ్రార్థింతు నాదు * వాకు దలిర్పన్ 2

క. వినువీథి నిన్నుఁ గన్నను
కనరాదట కాంక్షితములు * కని నిన్ను భజిం
చిన మోక్షకాంక్ష దీరదె?
కనుకిటు నిను గొల్తుఁ దార * కాలింగవిభూ 3

క. ధరను మహాకాళుని సం
బరమున నిను హాటకేశుఁ * బాతాళమునన్
వరుఁడుగని కాంచి వాంఛలు
కరమని మును లవరె? తార * కాలింగవిభూ. 4

క. కరచరణాదులు, గంగయుఁ
జరతారల నమరఁ జదలఁ * జరియించుమహా
పురుషా! లింగాకృతిశం
కర బ్రొక్కెద నీకుఁ దార * కాలింగవిభూ. 5

క. సురనదిని బూని ఖేచర
పరివృత్తము [illegible]ంటేధవళ * భావలితుదిగం
బరమూర్తిఁ గొనుట నిమ్మశం
కరునిగ నెంచితిని దార * కాలింగవిభూ. 6

క. మృగశిర శిరమార్ద్ర భుజం
బగుటన్ సన్మూర్తి ఖేచ * రాంగుఁడు నగునా
భగవంతుఁగ నినుఁ దలచితి
గగనవనవిహార! తార * కాలింగవిభూ.

క. జగదు దయస్థితివిలయము
లగులింగస్థలము నేవ * యని తెల్పుటకో
భగవానుఁడ లింగాకృతి
గగనమునఁ జరింతు తార * కాలింగవిభూ. 8

క. సీవార్ష్నల లగపడి యి
ష్టావాప్తిని, మృతిని సీత * లగపరుపకయుఁన్
నీ విటు సూచింతువు కద
కావేనూత్రాత్మ! తార * కాలింగవిభూ. 9

క. జ్ఞానములు వెట్టులగలిను
జ్ఞానపు వృత్తి వలె నీవు * చరతారలచం
దానను మసలుట కుజనులు
జ్ఞానాక యుండుటకో? తార * కాలింగవిభూ. 10

క. నిన్ను బోధానందజ్యో
తినిగా బోధింప నొరి * తిలకించిన వే
ద్య- సొసంగు జ్యోతిరూపుఁ
డగపడ కరుణాబ్ధి తార * కాలింగవిభూ. 11

క. తరియింపఁ జాత్రులగునీ
వరభక్తుల నఱువుకొలఁకు * బహిరంగముగాఁ
దిరుగుబహిస్తారక! నీ
కరుణకుఁ జేమోడ్తుఁ దార * కాలింగవిభూ. 12

క. నినువంటిస్వయంభూచే
తనతేజోదివ్యలింగ * దైవ మిఁకెందుం
గనరాము నమితభక్తిం
గని నిన్ను భజింతుఁ దార * కాలింగ. 13

క. వనజాసనుండు తన తన
యను వలచిన నతని నొంచి * యాదోషముఁ బా
పిననీదుపూతచరితము
ఘనవిభవము నెంతుఁ దార * కాలింగ. 14

క. తను వలచితొడరునజుభయ
మున మృగియై యింటఁ బఱచి * మొఱలిడునజుఁ జం
పనఁగాన వెలసినదయా
ఘనమూర్తీ శరణు తార * కాలింగ. 15

క. అంబరవనమున మృగయా
డంబరముం బూని మృగవి * డంబనపరుఁడై
నంబుజభవు నేసినకథ
కం బాయనిరాయ! తార * కాలింగవిభూ. 16

క. కేవలము భక్తిహీనమున
కై వెలసి సదా దివిషద * గణదితిజులు నిర్జ
సేవించిన గ్రైవశములు
కాదే మెల్లెల్లఁ దార * కాలింగ.

క. దూరస్థున కర్చన సమ
కూరదు తమి యున్న; గానఁ * గొలిచెద నద నా
త్మారామఁ నిన్ను నీసా
కారత నెదఁ జూపు తార * కాలింగ 18

క. నిను శ్రుతి ప్రాణేమ్యంత
ర్మనసోలింగ,, మనఁబట్టి * మదిలో నీయు
న్కి నెఱింగి నిన్ను నామదిఁ
గనరా వేఁడితిని దార * కాలింగ. 19

క. కనుచీఁకటియును నీజగ
మును లేనిదివిన్ నమంత్రబ * బోధింపుమయా!
వెనుక న్నీసగుణాకృతిఁ
గనఁబఱుపు జోహారుతార * కాలింగ. 20

క. బహుపుణ్యాలభ్యమానీ
మహనీయపురూపుఁ జూపి * మ్మామకపూజా
బహుమాన మొంది నను భవ
వహనముఁ దాఁటింపు తార * కాలింగ. 21

క. కమదోయిపండుఁ గని లో
మునిరాయలు వడసి తలమ * బూ చెడిబోధా
మణిరాజమ! నినుఁ గాంచుట
ఘనభాగ్యము కాదె? తార * కాలింగ. 22

క. సదయా! నినుఁ జూపవయే
నెద నన్ను భవాబ్ధి ముంచు *, నిటు గాన భవ
త్పదసేవకారఁ బెట్టం
గదవే! నామదిని దార * కాలింగ. 23

క. నిను గొల్వఁగల్గిన న్నా
మనసావరుచు కల్పనాద * మత్కృతిపూజల్
కనియొదవుగాకదయతోఁ
గన రమ్మొకసారి తార * కాలింగ. 24

క. ఘనమందిరము లలంకృతు
లును భోగములుఁ, వినోద * లోపము రాకుం
డ నమర్పనోపు నీకెద
కను కది వశపడుపు తార * కాలింగ 25

క. అతుకు బ్రతుకు తనువునకే
సతతముఁ గొలువుసేయుఁ గాని * సదయా! నిను స
మ్మతితోఁ దృటికొలువ దిసీ
గతి గాదక మనసు తార * కాలింగ 26

క. మతిలోఁగ కున్న సత్య
వ్రత! యోగాదికము చదవ * ప్రారబ్ధము నం
తిఁధ గుమువు మనోధీనుల
గతిమార్గతియొగద తార * కాలింగ 27

క. మనసార నిన్నుఁ గొలిచిన
మనసా రంజిల్లు నిచ్చ * మనవచ్చునిమం
గనవచ్చు నెట్టిఫలమ్ములు
గనవచ్చిన వచ్చుఁ దార * కాలింగ 28

క. జీవులకై నీవునంగిన
యీవిశ్వ పదార్థములు గ్ర * హింతువె మరలం
గావున నీకు నవార్ఘ్యము
గావించెద మదినిఁ దార * కాలింగ 29

క. నామది కూర్చిన పూజా
సామగ్రిని స్వప్నవస్తు * సమము గని విడఁబోఁ
కామోదింపుము సత్యము
గా మన్నించుచును దార * కాలింగ 30

క. శివ! సత్సంకల్పనము
ద్భవు సాంకల్పిక శివార్ఘ్య * తతి సత్యంబున్
శివముఁ గద హేతు గుణములు
శివియవె కార్యములఁ దార * కాలింగ 31

క. గురుకరమునఁ జిన్మయులై
హరి! పుట్టి వశిత్వమునకి * వాత్మకులా శ్రీ
గురుపుత్రులకు శివార్చన
కరమది గురునాజ్ఞ తార * కాలింగ 32

క. శివుఁడీయక శివునివశి
త్వవిభూతింబడయుటెట్లు? * వశి కాక
శివుండవునా తలక్రిందైనను?
గవివినుతా! మోఁదుడు తార * కాలింగ 33

క. శివభావమెడలకుండఁగ
శివభక్తిమనోజయంబుఁ * జేసి త్రిశుద్ధిన్
శివ! నిస్మాపించినభ
క్తవరేణ్యులఁ దెలతుఁ దార * కాలింగ 34

క. తనుదేర దేవతలై
త్యనికాయముచేసి హార్దికుడం * బున్ బ్రా
బ్రణవంపు గంటగంటన్
గని విని మొరయింతుఁ దార * కాలింగ 35

క. మదివత్తి నాదుచమురున
మొదిపి దృగంతర మటన్ప్ర * మిదలో వెలిగిం
చెదఁ జద్దీపము సర్వముఁ
గదిరి కనంబడఁగఁ దార * కాలింగ 36

క. సర్వగతా! సర్వాశ్రయ
సర్వజ్ఞా! సర్వమయ! నీ * సజ్ఞానందా!
సర్వాతీత! మహేశ! య
గర్వత నినుఁ దలఁతుఁ దార * కాలింగ 37

క. ఎక్కడనన నక్కడఁగల
వెక్కడఁ గనరావు నిండి * యును జగములకుం
జక్కగ నెడమిచ్చెదవిది
యక్కజముగదయ్య! తార * కాలింగ 38

క. రవిమండలస్థ! భర్గా!
శివ! యవ్యయ! యోత్రి నేత్ర * సితగళ! సాంబా!
భవహర! నీదన్న మొనఁ
గవ నినుధ్యానింతుఁ దార * కాలింగ 39

క. ఎందెందును నినుఁగొలిచిన
నందం దీవుండి సేవ * లందుచు నిటనా
యందిచ్చు పూజలందవొ
గంటోఁచునశంక? తార * కాలింగ 40

క. కనవచ్చిన నీవచ్చిన
గొనవచ్చు న్నిన్ను గొల్చు * కొనవచ్చురునే
ననవేటికిఁ దగులనివిం
కనవచ్చును మనము తార * కాలింగ 41

క. తనవత్తువు పుణ్యులకే
తనవచ్చినవచ్చు మేలు * కావున నీద
ర్శనమును సుకృతఫలంబని
ఘనమతిఁ గీర్తింతుఁ దార * కాలింగ 42

క. పలుబాముల బహుభంగుల
నలసితి నని నాకుఁ గడుద * యన్ నీభక్తిన్
గలిగించితి వీఁకనిన్గనఁ
గలిగింపు భజింతుఁ దార * కాలింగ 43

క. జ్ఞానాబ్ధి నీతరంగము
నేనిటు నీవాఁడ నన్ను * నెకఁగ్రోయుము దు
ర్జ్ఞానంపుకోటనీవని
కై నినుఁబూజింతుఁ దార * కాలింగ 44

క. దేవా! తనభక్తునకును
దేవునకుందగు నతీవ * తిన్యాయమటుల్
గావున మనకనపాయత
కావలె ధర్మమిది తార * కాలింగ 45

క. కులదైవము వని నాకుం
గలయ ట్లభిమానమేల * కలుగదు నాకో
విలనిజ భక్తుండని దయ
తలఁచేని న్నీకుఁ దార * కాలింగ 46

క. కాలాంతక! నీవ్రుగినా
త్రిశూలం జూపట్టి నాదు * పూజలుగొనవే
నేలామానుదు నాకా
కాలునిదండనము? తార * కాలింగ 47

క. నామేనులెన్నికోట్లును
సాములుచేయుటనెట్లొ * సాంబ!యిఁకెన్నం
డో మాయ నోర్చి పూర్ణ
కాముఁడనై మనుట? తార * కాలింగ 48

క. ఆపదలం బడఁజాలక
నీపదములఁ బడఁదలంతు * నేనవి హార్దికే
నాపట్టునమ్మొ నేనిఁక
గాపుమనుము నన్ను దారి * కాలింగ 49

క. నినుఁబూజించెదనన్న నె
వనజభవుఁడు కానలేని * భవదీయశిరం
బును గాంచి పూజసేయం
గనుశక్యమె నాకుఁ? దార * కాలింగ 50

క. మనను మనోభవు నీరిపుఁ
గనెనన్నుఁగ చేతనయ్యొ * కనుపట్టవు? నా
మనసున నెల్లెడఁ గలచి
ఘ్నుడవు మది లేవ? తార * కాలింగ 51

క. దాఁగితివి సురాభాండము
లో గమళుల పడఁతిక్రై లో * లుత నీవిపుడే
జోగిఘటంబున భక్తికిఁ
గా గనుమొఱఁగితివి? తార * కాలింగ 52

క. నినుఁ బ్రాణపదముగానా
కనురెప్పలలోననునిచి * కడుభక్తి మెయిం
గనుఁగొననా వనివిననా
కనరావనరావుతార * కాలింగ 53

క. అన్నా! యేమయ్యా! దృ
శ్యన్న శ్యమ్మనుటచేఁబ్ర * సన్నుండవ ప్రగా
కున్నావా? నినుఁ బార్థుఁడు
గన్నాఁడుగదయ్యా! తార * కాలింగ 54

క. హరియువిరించియుఁ బోరికిఁ
దారకొన మధ్యస్థుఁడవయి * తాపవినాశా
త్పర! తేజోలింగమవై
కరుణింపవె వారిఁ? దార * కాలింగ 55

క. నీవుస్వయంభూలింగమ
వై వెలయవె శ్రీనగాదు * లందుఁ డింముగా
సేవకవరులఁ గృతార్థులఁ
గావించెడికొఱకుఁ దార * కాలింగ 56

క. నీయష్టమూర్తులగునట
యీయఖిలము; మితినొప్పి * శివపు,[illegible]కే
మీ యింకనాకుఁ గనబడఁ
గాయమహార! నీకు? తార * కాలింగ 57

క. నినువిశ్వమయునిఁ గాంచెద
ననునను దయనీవుఁ జూడ * కది ఫలమింనే
తనునాదటఁ గననివిభుం
గనినటువృథగాక తార * కాలింగ 58

క. నినుఁగన్న భగీరథుపా
వనభావంబెంతయొప్పె * భాగీరథయై
తనవారికిఁ బెరవారికిఁ
గనఁదారకమయ్యెఁ దార * కాలింగ 59

క. ఏనుడాసి సేమమసిగెడి
నినుఁగన్నముదంబు, గరిమ * నీపదములఁ బ్రా
లిన నన్ను నెత్తునీకృపఁ
గనకిఁకనిన్వీడువఁ దార * కాలింగ 60

క. నినుఁబలుకరింపకున్నను
వినకున్నన్ సిద్ధమునులఁ * విద్యానుభవం
బననేల? మనుజజన్మము
కనినఫలంబేమి? తార * కాలింగ 61

క. రమ్మా! నాచెంతకుఁ బన
మిమ్మా! మ్రొక్కెదను జేర * నిమ్మా! కొలుతుం
దెమ్మా! చెవినామొఱవినఁ
గమ్మా! సదయుఁడవు తార * కాలింగ 62

క. నమ్మితినిను నమ్మనునిను
నమ్మిన క్రి[illegible]నెుగుల సు[illegible]ల * నరులనుసిరితే
నెమ్మన వాపొమ్మన వెసఁ
గమ్మా! సదయుఁడవు తార * కాలింగ 63

క. కాళీముఖకేళీనళి
నాళీకృత మైసనీక * టాఁకుము నాహృ
త్కేళీవని విందాదఁగఁ
గాళీప్రియ! నెఱవుతార * కాలింగ 64

క. మమపక్ష భక్తినాటక
మదనై నాలోన నార్తి * యాఁతును కరుణా
సదనమయి నీకుఁ బ్రియుడుముఁ
గద యది గన రమ్ము తార * కాలింగ 65

క. నందిహయము దిగి విూహతు
లందీయ కరావలంబ * మాశ్రితతతి నా
డెందమున విడియుమా! జిత
కందర్ప! శుభాంగ! తార * కాలింగ 66

క. చిణిచిణి డింఢిమి భంభం
క్వణనంబులతోడఁ దూర్య * వాద్యంబులుగాఁ
బ్రణవము మొఱసెడు గనుకీ
క్షణమే శుభవేళ తార * కాలింగ 67

క. నాదశ్రుతి మైజల్లు బ్ర
మోదరసం బెల్లకడల * బుణ్యాహముగా
వేదాద్యోంకారం బెది
కాదుశుచిస్థలము? తార * కాలింగ 68

క. రవిచంద్రానల మయమై
భవహరమై విశ్వరూప * భవసమాఖ్యం
దవుహృదయపీఠ మిదె యొ
క్కవె పాదుక లొసఁగి తార * కాలింగ 69

క. పాపాంబుద ఝంఝానిల
మాపద్వనదావవహ్ని * యజ్ఞానతమో
దీపం బగునీపాదుక
కాపయ్యెడు నాకు దార * కాలింగ 70

క. సుందరమణిమందిరముల
బొందించెద నుచితపీఠ * ముల నీదరి నీ
సుందరులను నందందని
కం దగువారలను దార * కాలింగ 71

క. చను విచ్చితి శిరమొక్కఁగఁ
దను విచ్చితి వర్ధమొప్ప * దగు
మనిచెప్ప నాత్మభూతిన
కనిత్తువు భళిర! తార * కాలింగ 96

క. కొలువుంటివి బాణునికడ
జలజాక్షున కోటువడితి * సరిరా నీభ
క్తులుకోరినవరమొల నీ
గలవాత్సల్యంబు! తార * కాలింగ 97

క. అనిఁ గ్రీడి కోడుదువె భ
క్తవకున్ వశుఁడ వని కాశ * గొడఁగల్పాంతం
బున హారిరక్తము విధివు
న్ఘను ద్రాగసి రుద్ర! తార * కాలింగ 98

క. భూతహృదంతరములలో
జ్యోతిర్లింగంబ వగుచు * నుండియు నెవ రే
రీతిఁ జరించిన నయితువు
గా! తగు నీశాంతి తార * కాలింగ 99

క. ఫాలమునఁ గన్ను, నగమొయి
బాలామణి, సిగ న * జాండ ధరితాంబరమున్
గ్రాలు మొయి దాల్చుకంఠే
కాల! నిరుపమాంగ! తార * కాలింగ 100

క. రజతాచలకల్పద్రుమ
నిజదేవీకీర్తి పురుష * నిఖిలామలన
ర్వజనిష్టలకరుణాచ్ఛాం
గ! జయ! వృషతురంగ! తార * కాలింగ 101

క. కలుగదా! నీసన్నిధిఁ
బలురూపులఁ బ్రమథవరులు * బ్రాచీనులు వా
రల కెఱిఁగి వారియనుమతి
గలుగ నిను భజింతుఁ దార * కాలింగ 108

క. గిరిసింగిణి ధరియించినఁ
గిరిపైఁ జరియించుచున్న * గిరి మందవటు
ద్ధిర! వేడ్క గనవలతు నీ
కరపదజలజములు తార * కాలింగ 109

క. కోకిలలకు మాధవమును
గేకులకు ఘనాఘనంబు * ప్రియ నీపదనీ
వాకాలమె నా కామిత
కాకోదరహార! తార * కాలింగ 110

క. నానావర్ణము లేస్ఫూ
మానాన్వితంపుఁ బాత్ర * మం దిడుకొని నీ
మానితపదములు కడిగెద
జ్ఞానామృతధార దార * కాలింగ 111

క. నీపాదజలము చవిగొని
నాపైఁ జల్లుకొనఁ జల్ల * నగ్నై యది నా
తాపత్రయ ముడుగుటకుం
జ్ఞాపక మని తలఁతుం దార * కాలింగ 112

క. హర! పదవనజము తమవలె
వరమిమటం బొసఁగు బాంధ * వమున సురక్రుల్
ఫరగించినపాద్యము శం
కర! నీ కిదఁ గూర్తుఁ దార * కాలింగ 113

క. నిన్నుఁ గాత్యాయని, జాహ్నవి
వినుతించిన పద్యయుగము * వీనులవిందై
మనమున్ బ్రేదిన నీయొక్క
గణుతిమెయిఁ బఠింతుఁ దార * కాలింగ 120

క. ఉండనియటుఁ లుండఁగ నెగ
ముండినగతి నిండనెఱుఁగ * కున్నటు లెఱుఁగన్
మొండగు నీపాండిత్యము
ఖండత వెలయుతను దార * కాలింగ 121

క. జగములఁ గని పెంచెడినీ
జగదవిదితబాంధవంబ * దంగూడనైనం
దగు నీజగదీశత చ
క్కఁగ మతి కెక్కఁగను దార * కాలింగ 122

క. పొందుగ నీతల యందుఁ జం
దనకర్పూర సురుచి * నందఁగి మానెన్
డెందము మెయి నీమెయినది
క్రందుగ మర్దింతుఁ దార * కాలింగ 123

క. నీతలనెల వెన్నెల యన
శాతిన్నదుపైన నీక * పర్దమునందుం
గేశచము రంటెడ ని
ప్పైతవముగుళ్ళ దార * కాలింగ 124

క. లొద్దుగపాటిగంధవృక్షం
దద్దయుఁ బన్నిట ప్పొదిపి * వలుగిడి నీపై
నిద్దవుఁ జేలం దుడిచెద
గద్దవఘావించి దార * కాలింగ 125

కం. నాయికతో సఖులంబలె
సాయుజ్యముతోడ నిన్ను * సామీప్యాదుల్
పాయక చేరె మది న్నీ
కాయం బగుటగ న తార * కాలింగ 126

కం. ఈవిశ్వ మమత కుంభము
గావించి శివాత్మబుద్ధి * కై నుడసి మహా
దేవా,, యని యభిషేకము
గావించెద నీకుఁ దార * కాలింగ 127

కం. పొంగారుగారుమూర్పుల
శృంగారరసంబుఁ జొచ్చ * చేయుదునీకుం
గంగాంబుమార్జనంబును
గంగోమారమణ! తార * కాలింగ 128

కం. సురధేనువు పశుపతి నని
పరమాప్తత నీకొసంగెఁ * బంచామృతముల్
గురుమతి నవిగైకొని శం
కర! నిను స్నపియింతుఁ దార * కాలింగ 129

కం. మునిచిత్త మాత్మ తీర్థం
బునవలె స్వక్షేత్రమగు * నభోనదితీర్థం
బున నతి మోదరసౌఘము
గను కేవ్వాలాను తార * కాలింగ 130

కం. స్నానాచమనముఁ గొను నా
మానసికాంబువుల భక్త * మానవబహుళో
ద్యానవిహారజటాహము
కావఁగ రాకుండఁ దార * కాలింగ 131

క. అచ్చరలు పేర్మి నొసఁగిన
యచ్చంపుంజలువవలువ * నర్థించు నీమే
నొచ్చక తడియొత్తెద నెద
గ్రచ్చుకొనివిభక్తిఁదార * కాలింగా 132

క. చేలాంచలమున వీచుచు
బాలాంబిక నీదు మేనఁ * బరిమళ మొలయన్
హేలాగతి ధూపం బిడఁ
గాలాగురుచేతఁ దార * కాలింగా 133

క. గంధపుఁబొగచే నీజను
లం దడి యుడిగించి భక్తు * లందలిదయ నీ
యందలి తమిఁ దెలిపెడిగం
దయఁగని గంటె దార * కాలింగా 134

క. దేవరసేవలలో నా
భావనగతిఁ దోడ్పడినవి * వాజహ్నుముతల్
సేవకజనవత్సల లని
గావింతుం బ్రణతు దార * కాలింగా 135

క. నీపూర్వాలింగ మాటను
దేవా! నాలోని యూర్ధ్వ * దేశసహస్రా
రావసతిఁ బ్రసన్నుండవు
గావే పూజింతుఁ దార * కాలింగా 136

క. నాదునిడాపింగళలను
బాధకలం దాటి ప్రణవ * పంచాక్షరికే
యూర్ధ్వక సుషుమ్నమార్గము
గాఁ దయచేయఁగదె! దార * కాలింగా 137

క. శిల్పులశిల్పార్థంబులఁ
గల్పించునుదార! తోలుకట్టెదనేలా?
కల్పింతు మహిళవస్త్ర
కల్పముఁ దయఁ దాల్పు తార * కాలింగ 138

క. ప్రాణము విశ్వవిభూతిఁ జి
దానంద విభూతి మన్న * ఫాలంగవిభూతిం
బూనుతఁ మదిం ద్రిరేఖలు
గా నీనమ్ముదుటఁ దార * కాలింగ 139

క. నీనిజము సంతతంబును
గానం బొనరించుమహాంస * గాయత్రి సదా
ప్రాణ మిదె బ్రహ్మసూత్రము
గా నీకర్పింతుఁ దార * కాలింగ 140

క. పరతత్త్వము దెల్ప జగ
ద్గురు వగుమాత్రాత్మ! నీకు * గురుకట్నము బా
గరు జన్నిద మొసఁగెద నెదఁ
గరుణం దాల్పు మిదె తార * కాలింగ

క. గంధద్రవ్యము లెల్లెడ 141
సంధించి జగత్ప్రియంబు సమకోల్పు జగ
ద్బంధూ! గానుమద్భక్తిను
గంధం బర్పింతుఁ దార * కాలింగ 142

క. తనువున నా కనురాగం
బున దీర్చెదఁ గుంకుమాంక * ముగనీఫాలం
బునఁ జేతఃఫాలాంతః
కనదాత్మజ్యోతి దార * కాలింగ 143

క. సురనది మకుటముతో నీ
శిరమునఁ గ్రొన్నెలతురాయి * జేర్చియపర్ణా
కరమున్ గైసేసెద శం
కర! నీమెయినెల్లదార * కాలింగ 144

క. శుకపిక సుమకిసలఫలా
దికమున వని నొప్పారెఁ * బెక్కు తీర్థగులోక
ప్రకరముచే నీవును వే
డ్కకుశోభిలఁ దలతుఁదార * కాలింగ 145

క. మెయి గంధకలప మలఁదక
యయయయో! వెలిబూది పూఁతు * రా యీశ్వరులెం
దయినను? నీమెయిఁగలపము
కయిసేసెద మదినిఁ దార * కాలింగ 146

క. పరిమళము నీనిపుష్కల
పసు లబ్ధిథివైనఁ దాల్పఁ * జనునే? సుమన
స్తరుల విరిసరులు గంధా
కరములు దాల్చుమివె తార * కాలింగ 147

క. మకుటాదిపాదకాంతము
సకలవిభూషలకుఁ దావి * సమస్తాల్పైకి క
ల్పకపుష్పకవచమొసవే
డ్కకుఁ దొడిగెద నీకుఁ దార * కాలింగ 148

క. గగనమహాసనసింగల
జగదంబుజకోటిఁ బూవ * నలుపుదు నీకుం
జగదాధారా! మది నీ
గగనశిఖాంతమునఁ దార * కాలింగ 149

క. కుడియెడమకనులు బొమ్మల
నడినాళము దళములై చ * నంగా హంసం
దొడిమెదొడిగి బిల్వార్చన
కడు నిట్లొనరింతుఁ దార * కాలింగ 150

క. కొండంతటి దేవునకుం
గొండంతయు బత్రియున్నె * కొనుభక్తిగ నే
కృండొసఁగితి నూఁగొప్పినను
ఖండేంమునకల్గు తార * కాలింగ 151

క. అనలముఖంబున నీచం
దన సంకుమదాజ్య మృగమ * దంబులుగొని నీ
యనిలాంగంబున ధూపము
గనుమా యర్పింతుఁ దార * కాలింగ 152

క. కనుచో దహరంబున దో
చిన తారల నాత్మకళల * సేసలుసీరా
జనములుగానీ కొసఁగెద
గణుతించుచు నిన్నుఁ దార * కాలింగ 153

క. పరిపక్వభక్తిపాచక
పరిపక్వంబైనవివిధ * పక్వాన్నచయం
పర సాపోశనముగ శం
కర! కుడువుము కూర్తుఁ దార * కాలింగ 154

క. సురనది సరసరసోపముఁ
బొరిసరసాన్నరుచి నన్న * పూర్ణయు నీతోఁ
బరగించెడి సరసోక్తులఁ
గర[illegible]ఁ బతి[illegible]ఁ దార * కాలింగ 155

క. గౌరీముక్తాతిలకము
దారకలింగంబు నొకవి * ధం బీజతకుం
గారణమిది మామా చెలి
కారముబలమొకద! తార * కాలింగ 156

క. విమలప్రకాశఝురవే
గమునజరించెదరు మింట * గంగయు నీవుం
డమి నెవరి నెవరు పోలం
గమకించిరో తొలుత? దార * కాలింగ 157

క. అని కంమన లాడుచు నీ
యనుగుంజెలు లొసఁగునుత్త * రాపోశనముం
గొని కొంత విడుపు పెతకులు
గన నతుష్టియతృప్తిఁ దార * కాలింగ 158

క. మదిబలితపుమడిలో నీ
పదభక్తులు నాటినట్టి * భావాంకురసం
పద కిష్టదేవతాకృతి
గదిరి ఫలించుఁగద తార * కాలింగ 159

క. నిమురవలెన్ వ్యథ లన్నిఁటిఁ
జిదిమెడినిజనిష్ఠ నబ్బు * చిత్సుఖరససం
పదచే నీవదనామలఁ
గదిసి కడిగి తుడుతుఁ దార * కాలింగ 160

క. ఆకుగ బరాకు, మొయిఁ దమి
పోకగ, నితరేచ్ఛముత్తై * ములనున్నముఁగా
నీ కవి తాంబూలం బవ్వ
గాకని యర్పింతుఁ దార * కాలింగ 161

క. కాయత్రయకర్పూరము
నీయంతర్జ్యోతిఁ జేర్చి * నీరాజనముం
జేయుదు నీకిదె నామది
గాయత్రీధ్యేయ! తార * కాలింగ 162

క. శృంగిరిటి వింతనటనలఁ
బొంగుచుఁ గీర్తించుప్రమథ * ముఖ్యులతో నీ
మంగళ హారతిఁ గొనుమా
గంగార్యులఁ గూడి తార * కాలింగ 163

క. మదియును ప్రాణము దృష్టిం
గుదురౌ తఱి స్వర్ణమంత్ర * కోశము గనసే
నదె స్వర్ణమంత్రపుష్పము
గదనర్చెద నీకుఁ దార * కాలింగ 164

క. వెలిలోఁ గలనీమహిమం
బుల వేలములైన వాని * పొలకువంబాహం
బలిగొని నీ కొసఁగెద సితి
గళ! పుష్పాంజలిగఁ దార * కాలింగ 165

క. ధ్యానంపుఁగాష్ఠ దోఁచిన
జ్ఞానంపుంగొడుగు భక్తి * కరమున నొసఁగెనీ
కానంద చ్ఛాయయిడం
గా నెదఁ బట్టెదను దార * కాలింగ 166

క. సురభిళనవచామరమున
మరువపు జొంపములఁ గుంచె * మలచి భవానీ
శ్వర! నీకు రాజసేవా
గరిమన్ వీచెదను తార * కాలింగ 167

క. ఇడుము లిడి పరీక్షింపక
యిడఁడు వరము భక్తులార! * యీశుఁడు ధైర్యం
బుడుగకుఁడీ యంచు భేరిం
గడు మది వాయింతుఁ దార * కాలింగ 174

క. మేరువును మింటనూర్యుఁడు
తిరుగ నాలోన నినుఁ బ్ర * దక్షిణమును ఘా
వారాధి వలగొని నమ
స్కారము లొనరింతుఁ దార * కాలింగ 175

క. మతిలో సర్వాంగాలిం
గితభూషలిడి యజింతుఁ * క్షితిమూర్తీ ని
న్నతిభక్తిఁ బన్నగ మేన
గితమోహాంగ జేయు తార * కాలింగ 176

క. నాలుక యాడఁగఁ గంఠము
పాడఁగ నూఁచెదను నిన్నుఁ * బహుభక్తి మనో
డోలిక సుఖశయనము కల
కాలంబందఁగదె! తార * కాలింగ 177

క. గోవిందరూపిణి మహా
దేవికి నీయుడుగు లొత్తి * దేమలు నే? త్రితలో
కావనముల నే నెత్తెదఁ
గావలములు పాపు తార * కాలింగ 178

క. నందీశుఁడు నీభక్తిం
కొందే నెలకొల్పవలసె * నేనంపుము నే
నందును కావలి నీకిఁ
కందరముఖ మందుఁ దార * కాలింగ 179

క. పలుజన్మంబులఁ జేసిన
యలవాటునఁ జేసియుండు * నపరాధశతం
బులు నీవుపూజయుం దవి
కలిగిన క్షమియింపు తార * కాలింగ 180

క. క్రియలందు భక్తియందును
నయియుండుఁ గొంతకొంత * యజ్ఞతచేనా
ప్రయతనమే ప్రియకరమని
కయి కొనునాపూజఁదార * కాలింగ 181

క. నాకీవె యొక్క దైవము
నీకో వేయాలపడి * నీకల్పుఁడనే
నాకుమహాదేవుఁడవే 182
కాకేగతి నాకుఁదార * కాలింగ

క. యజమాను నరికుసేయని
స్వజనము వలె విశ్వనాథు * ప్రాపొల్లనిమూ
ర్ఖజనంబగతికమైయు 183
కృజమా! చెనుననఁగఁ దార * కాలింగ

క. నేలవిడిచి సామునువలె
నేలానినువిడిచి ప్రజ్ఞ * లెనయఁగఁ జె
బోలా వ్యైకపరితుదయము 184
కాలికిఁదప్పుదురె తార * కాలింగ

క. అమితాయువు విధివ్రాయఁడు * జారటము మా
క్షమమూనఁడు యముఁడుమా
య మొదట నరకముతుద 185
క మిసీ! నరుజన్మ తార * కాలింగ

క. శైశవమాపరపోవ్యం
బాశావ్యథలెగద బాల్య * మాదియు నెపుడు
న్నాశభయమె ధీరతకవ
కాశమెదీమాకు? దార * కాలింగ 186

క. తేనువేమొపోకమానదు
తనువుండగ దానియందు * దగులము విడ దీ
తనుమోహమె భయమూలము
కనుకిది యెటుమాను దార * కాలింగ 187

క. తనువును వలెనిను రక్షకు
డనినమ్మినదాక మదిభ * యముపీడను పీ
కిన నీమకరుణ నొకపరి
క. కదియెటు నిల్చు దార * కాలింగ 188
దెబ్బ నాకునీదయ
దిటపడగు న్నాదువంత * లేగతిమతిలో
గటకట? నెటులప్పును
క. ఒల్లను సిరితులు తార * కాలింగ 189
మొల్లను విదె యశ
చల్లనిదయ జక్కెత్తు * జ్యోత్స్నతులను నీ
కల్లజగంబనుట దా
క. కక్కూర్తిగర్వాశే లింగ 190
నుక్కివమును బద్దెకు *
దక్కిన నీకృప నా శనికి దా
కక్కిన కూళ్లొల్ల దా కాలింగ 191

క. ఘను లెందఱో భువి భువిలో
ఘనుఁడైన, ననంతమహాజ * గంబులకెల్లన్
ఘనుఁడౌనాయయమునికిఁ? దా
ఘనుఁడౌనానరుఁడు తార * కాలింగ 192

క. చింతలకుఁ బుట్టినిల్లగు
స్వాంతంబున నీదుచింత * జనియింపద
సంతతమమరినవంతల
గంతులకెడమున్న తార * కాలింగ 193

క. చిరకాలమెఱుఁగు దేవర
పరిపాలన నన్ను నెన్ని * పాల్పఁబడితిన్
చిరమరయువారెభృత్యులఁ
గరుణాళుల్ విభులు తార * కాలింగ 194

క. ఆనంద మయుఁడవగునీ
కానందంబునకు దాన * లై మనుజీవుల్
కానంగ దానులేకద
కానందానుఁడను దార * కాలింగ 195

క. నీవే గతి భువనాళికి
నీవేగతిభువనకార్య * నిర్వాహణకళా
కోవిదులగు దేవతలకు
గావే నాకు గతి తార * కాలింగ 196

క. నాశక్తి కొలదినిన్ను మ
హేశా! గొల్చెదనునన్ను * నీవేలుదయన్
నీశక్తికొలఁది మనకిది
గా శపథం బింకఁ దార * కాలింగ 197

క. పరలోకయాత్రికుఁడునీ
కరుణాధనముప్పుఁగూర్ప * కయిముగిసినా
పరలోకమందుఁ జిరమే
కరణిన్ మననేర్చుఁ దార * కాలింగ 198

క. నినువిశ్వశాస్త్రయోనివి
యనివిని గురుభక్తిఁగొల్చి * నాఁడనినున్ భ
క్తిని ముక్తి నాకీవే
ఘనవాత్సల్యమునఁ దార * కాలింగ 199

క. నామది నీవయి నావయి
నీమదిఁ జేర్పుమిదుభక్తి * నిన్ ముక్తినా
కీమార్గముచెల్లదె? మ
త్కామితమిామాత్ర తార * కాలింగ 200

క. మతికుదురఁబెట్టి నను సం
సృతియొద్ద దురాశపెట్టి * చెరిమాన్పు ముపా
గతబంధున్ నను శరణా
గతబంధూ! ప్రీతిఁ దార * కాలింగ. 201

క. మరణమువువ్వులుదాఁటం
దరమాయటనిన్నుఁదలఁపఁ * దరమాయానే
ర్పరుపడినాకలవడఁగా
గరుణింపగదన్న తార * కాలింగ 202

క. తనుబాలనాధులవా
సనలఁ బలె మోహార్ణవఁ * జాలవె? నినుదిం
చినవేళ నంథసౌఖ్యము
గనవానినుఁ గొల్చి తార * కాలింగ 203

క. కనరాదు మరణకాలము
కనరాతటిఁగఫము రేఁగి * కబళించు మతిన్
నినునపుడు తలఁపనేరను
కనుకిదెయిది ప్రోవు తార * కాలింగ 204

క. ఆపదలఁ దండ్రి దినుతుం
గాపాడఁడె నీవునట్లు * కాలభటుల రా
రాపులఁకఁదొరఁచి తోడ్తోఁ
గాపాడవెవన్నుఁ దార * కాలింగ. 205

క. భువనారామంబులలో
భువనేశ్వరితోడఁ దపసి * పూబొదరిండ్లన్
శివభానుకుసుమశయ్యలఁ
గవగూడి సుఖంపు తార * కాలింగ 213

క. శివులు భవద్దంపతులనఁ
బ్రవచన మింకేల మీకుఁ * భద్రమని నమో
భవభవతే తేశాంకరి
కవినుగ శేయుందుఁ దార * కాలింగ 214

క. హితశుచిరుచిరపదార్థా
న్వితమైనన్ పింకుసెల్లు * నీశుని కని యీ
కృతినామెతఁ జేసితిఁ ద
ద్గతిఁ గూరిచి నీకుఁ దార * కాలింగ 215

క. సిరిమెచ్చెను హరిమెచ్చెను
మఱియెవరీనీచరిత్ర * మన్నింపరు నీ
చరితకుఁ బాలకులకునీ
కరుణం గోరయున్నె? తార * కాలింగ 216

క. ఇన్నూటపదార్ కందము
లన్నవరత్నముల గుత్త * మగుబన్న పరం
బున్నే మానసపూజవ
గ్గన్న కొనఁగితిని దార * కాలింగ 217

క. శ్రీరస్తు తవజయోస్తు
ప్రారంభస్యాస్యనిరవ * రాధతయామే
వారయమదఘాసినమ
స్కారాస్త్రేసవధి తార * కాలింగ 218

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# ప్రసిద్ధాంధ్ర గ్రంథములు.

---:o:---

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1 | సగ్మదాపురుషుత్సీయము. | 0 | 12 | 0 |
| 2 | రాధాకృష్ణ. | 0 | 6 | 0 |
| 3 | సారంగధరనాటకము. | 0 | 6 | 0 |
| 4 | కోకిల. | 0 | 12 | 0 |
| 5 | ప్రచండచాణక్యము. | 0 | 12 | 0 |
| 6 | పాదుకాపట్టాభిషేకము. | 0 | 12 | 0 |
| 7 | విప్రనారాయణ. | 0 | 12 | 0 |
| 8 | విజయరాఘవము. | 1 | 0 | 0 |
| 9 | తారాశశాంకనాటకము. | 0 | 10 | 0 |
| 10 | సువర్ణమాల. | 0 | 8 | 0 |
| 11 | సతీసంయుక్త. | 0 | 14 | 0 |
| 12 | ధనాభిరామము. | 0 | 8 | 0 |
| 13 | శ్రీయాచసూరేంద్రవిజయము. | 0 | 10 | 0 |
| 14 | వణిక్పృగవర్త్తకోదంతము. | 0 | 12 | 0 |
| 15 | సంగీతద్రౌపదీవస్త్రాపహరణము. | 0 | 8 | 0 |
| 16 | సంగీత రసతరంగిణి. | 0 | 12 | 0 |
| 17 | పుష్పలీలావతి. | 0 | 8 | 0 |
| 18 | చిత్రకథాసుధాలహరి. | 0 | 6 | 0 |
| 19 | నలచరిత్రము. | 1 | 4 | 0 |
| 20 | శైవలినీచంద్రశేఖరము. (మేలైననావలు) | 0 | 12 | 0 |
| 21 | వనవాసరాఘవము. | 0 | 12 | 0 |

ఈగ్రంథములు వలయువారు డి. వి. రమణారావు అండ్ కో, తెఃబళ్లు. కృష్ణాజిల్లా. అనివ్రాయవలయును.

